ఓం ఐం హ్రీం శ్రీం ఏతాః, అతిరహస్య యోగిన్యః, సర్వ సిద్ధి ప్రదే చక్రే, సాయుధాః, సశక్తయః, సవాహనాః,సపరివారాః, సర్వోపచారైః, సంపూజితాః, సంతర్పితాః, సంతుష్టాః సంతునమః (పుష్పాంజలిః).

మహాకామేశ్వర్యాః పురతః—

ఓం ఐం హ్రీం శ్రీం, హ్స్రైం హ్స్క్లీం హ్స్రౌః త్రిపురాంబా చక్రేశ్వరీ
శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ఓం,

ఓం ఐం హ్రీం శ్రీం హ్సౌః – ఇతి సర్వబీజ ముద్రాం ప్రదర్శ్య
శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః, ఓం,

మూలేన దేవీం త్రిః సంతర్ప్య—

ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, నీరాజనం చ సమర్ప్య—

ఓం ఐం హ్రీం శ్రీం, అభీష్టసిద్ధిం మేదేహి శరణాగతవత్సలే।
భక్త్యాసమర్పయే తుభ్యమష్టమావరణార్చనమ్॥

ఇతి, పూజాం సమర్ప్య— (అని ఉద్ధరిణితో నీటిని వదలవలెను.)

ఇతి, యోని ముద్రయా ప్రణమేత్.

# నవమావరణమ్

ఓం ఐం హ్రీం శ్రీం క15 సర్వానందమయ చక్రాయనమః (పుష్పాంజలిః)

బిందావుభిన్న పరబ్రహ్మాత్మకే బిందుచక్రే—

ఓం ఐం హ్రీం. శ్రీం, మూలం, శ్రీలలితా మహాత్రిపుర సుందరీ పరాభట్టారికా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ఓం, ఇతిత్రిః సంతర్ప్య।

ఓం ఐం హ్రీం శ్రీం ఏషాపరాపరాతి రహస్య యోగినీ సర్వానందమయే చక్రే, సాయుధాః, సశక్తయః (సశక్తిః) సవాహనాః, సపరివారా, సర్వోపచారైః సంపూజితా, సంతర్పితా సంతుష్టాః సంతునమః పుష్పాంజలిః

మహాత్రిపురసుందర్యాః పురతః

ఓం ఐం హ్రీం శ్రీం పంచదశీ శ్రీ మహాత్రిపురసుందరీ చక్రేశ్వరీ. శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ఓం,

## షోడశ్యుపాసకానామేవ—

ఓం ఐం హ్రీం శ్రీం హసకల హసకహల హ్రీం. తురీయాంబా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః ఓం, ఇతిత్రిః సంతర్ప్య—

ఓం ఐం హ్రీం శ్రీం సర్వానందమయే చక్రే మహోడ్యాణ పీఠే, చర్యానందనాథాత్మక, తురీయాతీత, దశాధిష్ఠాయక, శాంత్యతీత కలాత్మక, ప్రకాశావిమర్శ సామరస్యాత్మక పరబ్రహ్మ స్వరూపిణీ, పరామృతశక్తిః, సర్వమంత్రేశ్వరీ, సకల జగదుత్పత్తి మాతృకా, సచక్రా, సదేవతా, సాసనా, సాయుధా, శక్తిః సవాహనా, సపరివారా, సచక్రేశికా, పరాయా, అపరాయా, పరాపరాయా, సపర్యయా, సర్వోపచారైః, సంపూజితా, సంతర్పితా, సంతుష్టాస్తునమః । ఇతి సమష్ట్యంజలిం విధాయ॥

ఓం ఐం హ్రీం శ్రీం ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం నీరాజనం చ సమర్ప్య—

ఓం ఐం హ్రీం శ్రీం అభీష్టసిద్ధిం మేదేహి, శరణాగతవత్సలే, భక్త్యా సమర్పయే, తుభ్యం, నవమావరణార్చనమ్, (ఇతి పూజాం సమర్ప్య) (ఉద్ధరిణితో నీళ్లు వదలవలెను).

## ధూపః

ఓం ఐం హ్రీం శ్రీం ధూరసి ధూర్వ ధూర్వంతం యోఽస్మాన్ ధూర్వయంధయం ధూర్వామ త్వం దేవానామసి సస్నితమంపప్రిత మంజుష్టతమం వహ్నితమందేవి హూతమమహ్రూతమసి హవిర్ధానం దృగ్ంహ స్వమహ్వార్మిత్రస్యత్వా చక్షుషా పేక్షే మాభేర్మా సంవిక్థా మాత్వాహింగ్ం సిషమ్.

ఓం శ్రీలలితా మహాత్రిపురసుందరీ పరాభట్టారికాయైనమః ధూపమాఘ్రాపయామి, ధూపానంతరం ఆచమనీయం సమర్ప యామి॥

*1)* **ధూపము** = ధూపః; ఓం ఐం హ్రీం శ్రీం

ధూఃఅసి — హింసించుదానవు; ధూర్వంతం = హింసించు వానిని - ధూర్వ=హింసింపుము; యః అస్మాన్ ధూర్వతి=మమ్ము లను ఎవరు హింసించునో - తం ధూర్వ = వానిని హింసింపుము, యం వయం ధూర్వామః = ఎవనిని మేము హింసింపగల్గుదుమో, త్వం దేవానాం సస్నితమం అసి = నీవు దేవతలలో శుద్ధాపము పప్రితమం = ప్రియతముడవు, జుష్టతమం = శ్రేష్ఠహవ్యము, వహ్నితమం = గొప్పతేజస్సు, దేవహూతమం = దేవహోమ శ్రేష్ఠము, అహ్రూతం అసి - హరింపనివాడవు, హవిర్ధానం = హవిస్సుధరించు, దృగ్ంహస్వ = దర్శనమై, మహ్యోర్మిత్రస్య = గొప్పమిత్రునిగా, త్వా = నిన్ను - చక్షుషాప్రేషే = కంటితో చూచుచున్నాను, మాభేః మా = నన్ను గూర్చి శంకింపవలదు, సంవిర్దా = ప్రతిజ్ఞా-త్వా మా హిగ్ంసిషమ్=నిన్ను హింసింపను, ఓం శ్రీలలితామహాత్రిపురసుందరీ పరాభట్టారికాయైనమః ధూప మాఘ్రాపయామి, ధూపానన్తరం ఆచమనీయం సమర్పయామి.

## దీపం

ఓం ఐం హ్రీం శ్రీం ఉద్దీప్యస్వజాత వేదోపఘ్నన్నిరృతిం మమః పశూగ్ంశ్చ మహ్యమావహ జీవనం చ దిశోదిశః మానో

హిగ్ం సీర్జాతవేదోగామశ్వం పురుషం జగత్ । అబిభ్రదా అగహి శ్రియామా పరిపాతయ । ఓం శ్రీలలితామహాత్రిపురసుందరీ పరాభట్టారికాయైనమః దీపం దర్శయామి । దీపానంతరం ఆచమనీయం సమర్పయామి ॥ తతః సర్వసంక్షోభిణ్యాది ముద్రాః ప్రదర్శయేత్

*2) దీపః = దీపము; ఓం ఐం హ్రీం శ్రీం*

జాతవేద = ఓ అగ్ని. మమ = నాకు. నిర్ఋతిం = రాక్షసత్వమును. అపఘ్నన్ = తొలగించి, ఉద్దీప్యస్వ=ప్రకాశింపుము. పశూన్ చ = పశుసంపదను, మహ్యాం = నాకు, ఆవహ=ఇమ్ము జీవనం చ = జీవనమును, దిశఃదిశ = విస్తృతముగా ఇమ్ము. జాతవేదః = అగ్ని, నః = మాయొక్క. గాం = గోసంపదను, అశ్వం = అశ్వ సంపదను, పురుషంజగత్ = పురుషలోకమును మాహిగ్ంసీః = హింసింపకుము. అబిభ్రత్ = భరించి అగ్రే = ముందు. ఆగహి = రమ్ము. మా=నన్ను. శ్రియా = సంపదతో పరిపాతయ = పరిపాలింపుము.

ఓం శ్రీలలితామహాత్రిపురసుందరీ పరాభట్టారికాయైనమః దీపం దర్శయామి దీపానన్తరం ఆచమనీయం సమర్పయామి. తతః సర్వ సంక్షోభిణ్యాది ముద్రాః ప్రదర్శయేత్.

## నైవేద్యం

శ్రీ దేవ్యగ్రే చతురశ్రిమండలం సామాన్యార్ఘ్యోదకేన విధాయ తత్ర ఆధారోపరిస్థాపితం సౌవర్ణ రౌప్యకాంస్యాది స్థాలీ-

చషకభరితం భక్ష్యభోజ్య చోష్యలేహ్య పేయాత్మకం రసవద్వ్యం జనమంజులం ప్రాజ్యకపిలాజ్యందధి దుగ్ధముగ్ధం యాథా సంభవం వానై వేద్యంవిధాయ—

ఓం సః వౌషట్ – ఇతి సప్తవారమంత్రిత జలేన ప్రోక్ష్య. మాలేన విశేషార్ఘ్య బిందుభిః ప్రోక్ష్య.

దేవ్యైపాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం సమర్పయామి॥

3) నైవేద్యం = నైవేద్యము.

శ్రీ దేవ్యగ్రే = శ్రీదేవి ఎదుట, సామాన్యార్ఘ్యోదకేన = సామాన్యార్ఘ్యోదకముచే, చతురశ్రమండలం=చతురశ్రమండలము ఏర్పరచి, తత్ర=అచట, ఆధారోపరి = ఆధారముపైన, స్థాపితం= స్థాపించిన, సౌవర్ణ – రౌప్య – కాంస్యాది స్థాలీ చషకభరితం = బంగారు–వెండి–కంచు మొదలగు గిన్నెలలో పాత్రలలో నింపిన, భక్ష్య – భోజ్య – చోష్య – లేహ్య – పేయాత్మకం = ఘనపదార్థములు – వల్చని మృదు పదార్థములు – రసపదార్థములు, చప్పరించితినదగునవి పానయోగ్యమగు, రసవద్వ్యం జనమంజులం = రసవంతములైన వానితో ఇంపగు, ప్రాజ్య – కపిలాజ్యం=గొప్ప కపిల గోవునేయి, దధి దుగ్ధముగ్ధం = పెరుగు పాలతో మనోహరమగు, యథా సంభవం వా = దొరికినంతవరకుగాని, నై వేద్యం = నై వేద్యము, విధాయ=ఏర్పరచి —

మూలేన నిరీక్ష్య=మూలమంత్రముతో-

ఓం ఐంసః వౌషట్-ఇతి సప్త వారమంత్రజలేన ప్రోక్ష్య మూలేన వా శేషార్ఘ్య బిందుభిః ప్రోక్ష్య - నైవేద్యం;

దేవ్యై పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం - సమర్పయామి.

ఓం ఐం హ్రీం శ్రీం నమస్తే దేవ దేవేశి సర్వ తృప్తికరం పరమ్ అన్యాని వేదితం శుద్ధం ప్రకృతిస్థం సుశీతలమ్ అమృతా నంద సంపూర్ణం గృహాణజముత్తమమ్॥

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీలలితాయై అమృతపానీయం సమర్పయామి। భుంజానాం పరదేవతాం ధ్యాయేత్ ॥

*4) ఓం ఐం హ్రీం శ్రీం -*

దేవ దేవేశి=ఓ పరాదేవతా, తే=నీకు, నమః=నమస్కా రము. సర్వతృప్తికరం=సమస్తము తృప్తి నొందించునది, పరం=గొప్పది, అన్యానివేదితం=ఇతరులకు నివేదింపనిది, శుద్ధం= శుద్ధికలది, ప్రకృతిస్థం=ప్రకృతిసిద్ధమైనది, సుశీతలం=చక్కగా చల్లనిది అమృతానంద సంపూర్ణం అమృతానందములతో సంపూర్ణ మైనది, ఉత్తమం జలం=శ్రేష్ఠమగు జలమును, గృహాణ=గ్రహిం పుము;

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీలలితాయై అమృతపానీయం సమర్పయామి. భుంజానాంపరదేవతాం ధ్యాయేత్.

ఓం ఐం హ్రీం శ్రీం బ్రహ్మేశాద్యైః సహసమఖితః సూప విష్టైః సమంతా ద్దివ్యైకల్పైర్లవి తరమణీ వీజ్యమానా పఖిభిః సర్వక్రీడా ప్రహసనపరా హాసయంతీసురేశాన్ భుంక్తై పాత్రే కనకఖచితేషద్బాత్రి లోకధాత్రీ॥ దేవీం భుక్తవతీం సుతృప్తాంధ్యాత్వా—

ఓం ఐం హ్రీం శ్రీం ఓం అమృతాపిధానమసి । ఇత్యుత్తరాపోశనం దత్వా ఓం ఐం హ్రీం శ్రీం శ్రీలలితాయై హస్తప్రక్షాళనం, గండూషం, పాదప్రక్షాళనం, ఆచమనీయం, కల్పయామినమః॥ తత్రబలిపాత్రే నివేదన సామగ్రీః కించిత్కించిదాదాయనివేదన పాత్రాణి నీర్గమ తత్థ్సలం అస్త్రేణ శోధయేత్ । తాంబూలం॰ ఓం ఐం హ్రీం శ్రీం వనస్పతి దేవత్యాయ తాంబూలాయనమః । ఇతి సామాన్యార్ఘోదకేన ప్రోక్ష్య—

శ్రీం ఐం హ్రీం శ్రీం తమాల దళ, కర్పూర పూగ భాగవమన్వితమ్ ఏలాపత్రినుసంయుక్తం, తాంబూలం ప్రతి గృహ్యతామ్॥

ఓం ఐం హ్రీం శ్రీం ఓం శ్రీం లలితాయై తాంబూలం కల్పయామినమః.

*5) ఓం ఐం హ్రీం శ్రీం —*

శ్లో- లోకధాత్రి లలితరమణీ=లోకధాత్రి అగు లలితాదేవి, పతిసం

నిర్గమ తత్స్థలం=తొలగించి-ఆ స్థలమును, అస్త్రేణ శోధయేత్ = అస్త్రముతో శుభ్రము చేయవలయును.

తాంబూలం - ఓం ఐం హ్రీం శ్రీం—

వనస్పతిదేవత్యాయ తాంబూలాయనమః=వనస్పతి దేవత యగు తాంబూలమునకు నమస్కారము, ఇతి సామాన్యార్ఘ్యోదకేన= సామాన్యార్ఘ్యోదకముచే; ప్రోక్ష్య=తడిపి (చల్లి)

శ్రీం ఐం హ్రీం శ్రీం—

శ్లో॥ తమాల దళ-కర్పూర-పూగభాగ సమన్వితం=తమలపాకులు-పచ్చకర్పూరము - పోకచెక్కలు కలది, ఏలాపత్ర సుసంయుక్తం=ఏలకులు జాపత్రి కలది, తాంబూలం = తాంబూలము, ప్రతి గృహ్యతాం=స్వీకరింపుము.

ఓం ఐం హ్రీం శ్రీం లలితాయై తాంబూలం కల్పయామినమః.

## కులదీపః

ఓం ఐం హ్రీం శ్రీం మూలం అంతస్తేజే బహిస్తేజః ఏకీకృత్యామిత ప్రభమ్ త్రిధా దీపం పరిభ్రామ్య కులదీపం నివేదయే॥

6) కులదీపః ఓం ఐం హ్రీం శ్రీం – మూలం –

శ్లో॥ అంతస్తేజే = లోపల తేజస్సునందు; బహిస్తేః = బాహ్య

తేజస్సును, ఏకీకృత్య = ఏకముచేసి, అమితప్రభం=అమిత కాంతికల, త్రిధాదీపం = మూడు విధములగు దీపమును, పరిభ్రామ్య=పరిభ్రమింపచేసి, కులదీపం = కులదీపమును, నివేదయే=నివేదించుచున్నాను.

## కర్పూర నీరాజనమ్

ఓం ఐం హ్రీం శ్రీం సోమోవా ఏతస్యరాజ్యమాదత్తే। యోరాజా సన్రాజ్యోవా సోమేనయజతే। దేవసువామేతాని హవీంషి భవంతి ఏతావంతో వై దేవానాంగ్ం సవాః త ఏవాస్మై సవాన్ ప్రయచ్ఛంతి। తఏనంపునః సువన్తే రాజ్యాయ। దేవసూ రాజా భవతి॥

ఓం ఐం హ్రీం శ్రీం సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం
వైరాజ్యం పారమేష్ఠికం రాజ్యం మహారాజ్యధిపత్యం॥
నతత్ర సూర్యో భాతినచంద్రతారకం నేమావిద్యుతో
తమేవభాతో మనుభాతి సర్వం తస్య భాసాసర్వమిదం భవతి॥

భాంతి కుతోఽయమగ్నిః రాజాధిరాజా యప్రసహ్య సాహినేనమో వయం వైశ్రవణాయ కుర్మహే। సమేకామాన్ కామకామాయ మహ్యమ్। కామేశ్వరో వైశ్రవణో దదాతు। కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయనమః।

ఓం శ్రీలలితామహాత్రిపురసుందరీపరాభట్టారికాయైనమః కర్పూరనీరాజనం సమర్పయామి।

## 7) కర్పూర నీరాజనం

సోమః వా=చంద్రుడైనగాని, ఏతస్య= ఈ యొక్క రాజ్యం=రాజ్యము, ఆదత్తే=గ్రహించును, యః=ఎవడు రాజా సన్=రాజై, రాజ్యోవా=రాజ్యార్హుడై, సోమేన=సోమముచే, యజతే=(యజ్ఞము) పూజ చేయునో, దేవసువాం=దేవతలకు, ఏతాని=ఇవి హవీగ్ంషి=హవిస్సులు, భవన్తి = అగుచున్నవి, ఏతాన్తః వై=ఇవియే, దేవానాగ్ం దేవతలకు, సవాః=హవ్యములు, తేఏవ=వారే, అస్మై=ఈయనకు, సవాన్=హవ్యములను, ప్రయచ్ఛన్తి=ఇచ్చుచున్నారు తే=వారు, ఏనం=ఇతనిని, రాజ్యాయ=రాజ్యమునకు, సువన్తే=ఇచ్చుచున్నారు; దేవసూః= దైవానుగ్రహము కలవాడై, రాజా=రాజు, భవతి=అగుచున్నాడు, ఓం ఐం హ్రీం శ్రీం –

సామ్రాజ్యం=సామ్రాజ్యము, భోజ్యం=పరిపాలింపదగినది స్వారాజ్యం=స్వర్గరాజ్యము, వైరాజ్యం = విశేషప్రకాశమైనది, పారమేష్ఠికం రాజ్యం=బ్రహ్మ రాజ్యము, మహా రాజ్యం=మహా రాజ్యమైన అధిపత్యము.

తత్ర=అచట=బ్రహ్మరాజ్యమున, సూర్యః= సూర్యుడు, నభాతి=ప్రకాశింపడు, చంద్రతారకం = చంద్రుడు నక్షత్రములు ప్రకాశింపవు, ఇమాః విద్యుతః నభాన్తి=ఈ విద్యుత్తులును ప్రకాశింపవు, అయం అగ్నిః=ఈ అగ్ని, కుతః=ఎట్లు ప్రకాశించును ? భాన్తం = ప్రకాశించు, తమేవ = బ్రహ్మమును బట్టి,

సర్వం=అంతయు, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నది. తస్య=ఆబ్రహ్మము యొక్క, భాసా=కాంతిచే ఇదం సర్వం= ఇది అంతయు, విభాతి=ప్రకాశించుచున్నది.

రాజాధిరాజాయ=రాజాధిరాజగు, ప్రసహ్య సా హినే= పరిపాలకునకు, నమః నమస్కారము వయం=మేము, శ్రవణా యవై =వినుటకొరకు కుర్మహే=చేయుచున్నాము, సః=ఆ, కామే శ్వరః=కామేశ్వరుడగు, వైశ్రవణః = కుబేరుడు, మే = నా యొక్క, కామాన్=కోరికలను, కామకామాయ=కోరికలు కల, మహ్యం=నాకొరకు, దదాతు=ఇచ్చుగాక వైశ్రవణాయ=విశ్రవ సపుత్రుడు అగు, కుబేరాయ=కుబేరుడైన, మహారాజాయ=మహా రాజునకు, నమః=నమస్కారము.

ఓం శ్రీలలితామహాత్రిపురసుందరీ పరాభట్టారికాయైనమః, కర్పూర నీరాంజనం సమర్పయామి.

## మంత్రపుష్పమ్

యోఽపాంపుష్పం వేద। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి। చంద్రమావా అపాంపుష్పమ్। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి॥ యఏవం వేద। యోఽపామాయతనం వేద। ఆయతనవావ్ భవతి। అగ్నిర్వా అపామాయతనమ్॥ ఆయతన వాన్ భవతి॥ యోఽగ్నేరాయతనంవేద ॥ ఆయతనవాన్ భవతి॥ ఆపోవా అగ్నేరాయతనమ్॥ ఆయతనవాన్ భవతి॥ యఏవంవేద ॥

యో౽పామాయతనంవేద ॥ ఆయతనవాన్ భవతి॥ వాయుర్వా అపామాయతనమ్ । ఆయతనవాన్ భవతి ॥ యోవా యోరాయ తనంవేద॥ ఆయతనవాన్ భవతి॥ ఆపోవై వాయోరాయతనమ్ ॥ ఆయతనవాన్ భవతి॥ య ఏవంవేద॥ యో౽పామాయతనంవేద। ఆయతనవాన్ భవతి॥ అసౌవై తపన్నపామాయతనమ్॥ ఆయతన వాన్ భవతి॥ యో౽ముష్యతపత ఆయతనంవేద । ఆయతనవాన్ భవతి । ఆపోవా అముష్యతపత ఆయతనం ఆయతనవాన్ భవతి॥ యఏవంవేద । యో౽పామాయతనంవేద। ఆయతనవాన్ భవతి ॥ చంద్రమావా అపామాయతనమ్ ఆయతనవాన్ భవతి॥ యశ్చం ద్రమస ఆయతనంవేద। ఆయతనవాన్ భవతి। ఆపోవై చంద్రమస ఆయతనం॥ ఆయతనవాన్ భవతి॥ య ఏవంవేద॥ యో౽పామాయ తనంవేద॥ ఆయతనవాన్ భవతి ॥ యోనక్షత్రాణామాయతనంవేద, ఆయతనవాన్ భవతి ॥ ఆపోవై నక్షత్రాణామాయతనమ్ । ఆయ తనవాన్ భవతి । య ఏవంవేద । యో౽పామాయతనమ్ వేద । ఆయతనవాన్ భవతి ॥ పర్జన్యోవా అపామాయతనమ్ । ఆయతన వాన్ భవతి ॥ యః పర్జన్యస్యాయతనం వేద । ఆయతనవాన్ భవతి ॥ ఆపోవై పర్జన్యస్యాయతనమ్ । ఆయతనవాన్ భవతి ॥ య ఏవంవేదః యో౽పామాయతనం వేద ॥ ఆయతనవాన్ భవతి॥ సంవత్సరో వా అపామాయతనమ్ ॥ ఆయతనవాన్ భవతి ॥ యస్సంవత్సరస్యాయతనం వేద । ఆయతనవాన్ భవతి ॥ య ఏవం వేద । యోప్సునావం ప్రతిష్ఠితాంవేదః । ప్రత్యేవతిష్ఠతి ॥

8) మంత్రపుష్పమ్—

యః=ఎవరు, అపాం=నీటి యొక్క, పుష్పం=పుష్పము =కాంతి, వేద=తెలిసికొనునో, పుష్పవాన్=పుష్పవంతుడు ప్రజావాన్=సంతతి కలవాడు, పశుమాన్ = పశుసంపద కలవాడు, భవతి=అగుచున్నాడు; చంద్రమాః = చంద్రుడు. అపాం=నీటి యొక్క, పుష్పమ్వై=పుష్పముగదా, పుష్పవాన్=పుష్పవంతుడు, ప్రజావాన్=సంతతికలవాడు, పశుమాన్=పశుసంపద కలవాడు, భవతి=అగుచున్నాడు యః=ఎవరు, ఏవం వేద=ఇట్లు తెలిసికొనునో, యః=ఎవరు, అపాయం = నీటియొక్క ఆయతనం=ఉనికిపి=స్థితిని, వేద=తెలిసినవాడై, ఆయతనవాన్ = ఉనికి కలవాడు, భవతి అగుచున్నాడు.

అగ్నిః అగ్ని, అపాం=నీటికి, ఆయతనం వై=ఉనికి గదా, ఆయతనవాన్=ఉనికి కలవాడు, భవతి=అగుచున్నాడు, యః=ఎవరు, అగ్నేః=అగ్నియొక్క ఆయుతనం = ఉనికి, వేద=తెలిసికొనునో, ఆయతనవాన్=ఉనికి కలవాడు, భవతి= అగుచున్నాడు, అపః=నీరు, అగ్నేః=అగ్నికి. ఆయతనంవై = ఉనికి గదా, ఆయతనవాన్=ఉనికి కలవాడు, భవతి = అగుచున్నాడు, యః=ఎవరు, ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః= ఎవరు, ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః=ఎవరు, అపాం= నీటియొక్క, ఆయతనం=ఉనికి వేద తెలిసినవారు, ఆయతనవాన్=ఉనికి కలవారు, భవతి=అగును;

చంద్రమాః=చంద్రుడు, అపాం=నీటికి, ఆయతనంవై = ఉనికిగదా, ఆయతనవాన్=ఉనికి గలవాడు, భవతి=అగును, యః=ఎవరు. చంద్రమసః=చంద్రునియొక్క ఆయతనం=ఉనికి, వేద= తెలిసికొనునో, ఆయతనవాన్= ఉనికికలవాడు భవతి=అగును చంద్రమసం:= చంద్రునకు, ఆపః= నీరు ఆయతనంవై = ఉనికిగదా, ఆయతనవాన్= ఉనికిగలవాడు భవతి= అగును. యః= ఎవరు, ఏవం= ఇట్లు, వేద= తెలిసకొనునో, యః= ఎవరు, అపాం= నీటికి, ఆయతనం= ఉనికివేద= తెలిసినవారు, ఆయతనవాన్= ఉనికికలవాడు భవతి= అగును;

అపాం= నీటికి, నక్షత్రాణి= నక్షత్రములు, ఆయతనంవై= ఉనికిగదా, ఆయతనవాన్= ఉనికికలవాడు, భవతి= అగును, యః= ఎవరు, నక్షత్రాణాం= నక్షత్రముల యొక్క, ఆయతనం= ఉనికి, వేద= తెలిసికొనునో, ఆయతనవాన్= ఉనికి కలవాడు, భవతి= అగును, ఆపః= నీరు, నక్షత్రాణాం= నక్షత్రములకు, ఆయతనంవై = ఉనికిగదా, ఆయతనవాన్ = ఉనికి కలవాడు, భవతి=అగును. యః=ఎవరు, ఏవం=ఇట్లు, వేద = తెలిసికొనునో, యః=ఎవరు, ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః=ఎవరు, అపాం=నీటి యొక్క, ఆయతనం=ఉనికి, వేద=తెలిసినవారు, ఆయతనవాన్= ఉనికికలవాడు భవతి=అగును;

పర్జన్యః=మేఘుడు అపాం=నీటికి, ఆయతనంవై =ఉనికి గదా, ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతిఅ=గును, యః=ఎవరు,

పర్జన్యస్య=మేఘునియొక్క, ఆయతనం= ఉనికి వేద=తెలిసి కొనునో. ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతి=అగును, అపః= నీరు, పర్జన్యస్య=మేఘునకు, ఆయతనంవై=ఉనికిగదా, వాయుః=వాయువు, అపాం=నీటికి ఆయతనం=ఉనికిగదా ఆయతన వాన్=ఉనికికలవాడు, భవతి=అగుచున్నాడు, యః=ఎవరు వాయోః=వాయువుయొక్క, ఆయతనం=ఉనికి వేద=తెలిసికొనునో, ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతి=అగును, వాయోః=వాయువు యొక్క, ఆయతనం=ఉనికి, ఆపంవై=నీరుగదా, ఆయతనవాన్= ఉనికి కలవాడు, భవతి=అగును, యః = ఎవరు, ఏవం = ఇట్లు, వేద=తెలిసికొనునో, యః=ఎవరు, అపాం = నీటియొక్క, ఆయతనం = ఉనికి, వేద = తెలిసినవారు, ఆయతనవాన్=ఉనికికల వారు, భవతి=అగును;

అసౌ తపన్=ఈ సూర్యుడు, అపాం=నీటికి ఆయతనంవై=ఉనికి గదా, ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతి=అగును. యః=ఎవరు, అముష్య=ఈ, తపతః=సూర్యునకు, ఆయతనం= ఉనికి, వేద= తెలిసికొనునో, ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతి=అగును, అముష్యతపతః=ఈ సూర్యునకు, అపః=నీరు, ఆయతనంవై= ఉనికిగదా, యః=ఎవరు, ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః= ఎవరు, అపాం=నీటియొక్క, ఆయతనం=ఉనికి, వేద=తెలిసిన వారు, ఆయతనవాన్=ఉనికి కలవారు, భవతి=అగును.

ఆయతనవాన్ = ఉనికికలవాడు, భవతి=అగును, యః=ఎవరు ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః=ఎవరు, అపాం=నీటి యొక్క, ఆయతనం=ఉనికి, వేద=తెలిసినవారు, ఆయతనవాన్= ఉనికి కలవాడు, భవతి అగును.

సంవత్సరః=సంవత్సరము, అపాం=నీటికి, ఆయతనంవై = ఉనికిగదా, ఆయతనవాన్=ఉనికికలవాడు, భవతి=అగును, యః=ఎవరు, సంవత్సరస్య=సంవత్సరముయొక్క ఆయతనం= ఉనికి, వేద=తెలిసికొనునో, ఆయతనవాన్=ఉనికి కలవాడు, భవతి=అగును. ఆపః=నీరు. సంవత్సరస్య=సంవత్సరమునకు, ఆయతనంవై =ఉనికిగదా. ఆయతనవాన్=ఉనికి కలవాడు, భవతి= అగును. యః=ఎవరు, ఏవం=ఇట్లు, వేద=తెలిసికొనునో, యః= ఎవరు, అప్సు=నీటియందు, నావం=నావను, ప్రతిష్ఠితాం=ప్రతి ష్ఠింపబడినదానినిగా, వేద=తెలిసికొనునో; ప్రతి + ఏవ + తిష్ఠతి=ప్రత్యేవ తిష్ఠతి=జ్ఞానపూర్ణుడుగానే ఉండును.

## సువాసినీ పూజా

ప్రాజ్ఞ మంత్రితాం సువాసినీ మాహూయతాందేవీ రూపాం విభావ్య ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సువాసిన్యై అర్ఘ్యం కల్పయామినమః । ఇత్యాదిరీత్యా అర్ఘ్య-ఆచమన-స్నాన-గంధ, హరిద్రా కుంకుమ పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూలాని దద్యాత్ (పతివిభవే వసనాని చ).

సాచ దీక్షితాచేత్ మూలేన సమస్త ఏత్రికపేత్యాది సమష్ట మంత్రేణ చక్రమేణ శ్రీ దేవ్యై ఆవరణ దేవతాభ్యశ్చ పుష్పాం జలిందద్యాత్ । తతస్త స్యాః కరేక్షీరపాత్రం నాగరఖండంచ సమర్పయేత్ । సాచ ఉత్థాయ శిరసి హృదయే ఆత్మ చతుష్టయం సంతర్ప్య చక్రే దేవీంత్రిః సంతర్ప్య మూలేన పాత్రం వామకరే ధృత్వా దక్షిణ కరేణాచ్ఛాద్యోపవిశ్య తత్త్వాని శోధ యేత్ । కరాపునః పాత్రాంతరమాదాయ వక్ష్యమణ మంత్రేణ తస్మై సమర్పయేత్ (అదీక్షితా చేదశి పాత్రదానమేవ) యథా. ఓం ఐం హ్రీం శ్రీం అలి పాత్రమిదంతుభ్యం దీయతేపిశితాన్వితమ్। స్వీకృత్య సుభగేదేవి యశోదేహిః పూష్ జహి॥

ఇతి మంత్రేణ సువాసిన్యైఅథవా శ్రీదేవ్యై సమర్పయేత్। సాపితత్ సావశేషం స్వీకృత్య—

ఓం ఐం హ్రీం శ్రీం వత్సతుభ్యం యథాదత్తం పీతశేషం
కులామృతం త్వచ్ఛత్రూన్ సంహరిష్యామితవాభీష్టం
దదామ్యహమ్॥

ఇతి మంత్రేణ ప్రతి దద్యాత్ । తతః సాధకః సువాసినీం భోజయిత్వా సంతర్ప్య తాంబూలాద్యైః సంతోషయేత్ ॥

9) సువాసినీ పూజా

ప్రాక్=ముందు, నిమంత్రితాం=నియమించిన, సువాసినీం= పుణ్య స్త్రీని ఆహూయ=పిలిచి, తాం=ఆమెను, దేవీరూపముగా,

విభావ్య=భావించి, ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః, - సువాసిన్యై=సువాసినికి అర్ఘ్యం=అర్ఘ్యమును (పూజాద్రవ్యము) కల్పయామి=సమకూర్చుదును నమః=నమస్కారము; ఇత్యాదిరీత్యా= ఈ విధముగ, అర్ఘ్య-ఆచమన-స్నాన-గంధ-హారిద్రా-కుంకుమ-పుష్ప-ధూప-దీప-నైవేద్య-తాంబూలాని =అర్ఘ్యము, ఆచమనము, స్నానము, గంధము, పసుపు, కుంకుమ, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము దద్యాత్ =ఈయవలయును; (సతి విభవే=వైభవమునుబట్టి, వసనావిచ=వస్త్రమును).

సా చ=ఆమెయు, దీక్షితాచేత్=దీక్షనొందినదైనచో, మూలేన= మూల మంత్రముచే, సమస్త ప్రకటేత్యాది సమష్ట మంత్రేణ చ= సమస్త ప్రకటేత్యాదిక సమష్ట మంత్రముతోను, క్రమేణ=క్రమముగా శ్రీదేవ్యై=శ్రీదేవికి, ఆవరణ దేవతాభ్యః, చ=ఆవరణ దేవతలకును పుష్పాంజలిని, దద్యాత్=ఇయ్యవలెను. తతః=పిమ్మట తస్యాః=ఆమెయొక్క, కరే=చేతియందు, క్షీరపాత్రం = క్షీరపాత్రమ నాగరఖండం చ = నాగరఖండమును అల్లపు ముక్కను సమర్పయేత్=సమర్పింపవలయును, సా చ=ఆమెయు, ఉత్థాయ లేచి, శిరసి=శిరస్సునందు, హృదయే=హృదయమునందు, ఆత్మ చతుష్టయం=ఆత్మ చతుష్టయమును, సంతర్ప్య=తృప్తినొందించి, చక్రే=చక్రమున, దేవీం=దేవిని త్రిః=మూడు మారులు, సంతర్ప్య=తృప్తిపరచి, మూలేన=మూలమంత్రముచే పాత్రం= పాత్రను, వామకరే=ఎడమచేతియందు, ధృత్వా=ధరించి, దక్షిణ కరేణ=కుడిచేతితో, ఆచ్ఛాద్య = కప్పి, ఉపవిశ్య = కూర్చుండి

తత్త్వాని=తత్త్వములను, శోధయేత్=శోధింపవలెను. కర్తా=కర్త పునః=మరల, పాత్రాంతరం=మరియొక పాత్రను, ఆదాయ = తీసికొని, వక్ష్యమాణమంత్రేణ = చెప్పబోవు మంత్రముతో. తస్యై=ఆమెకు సమర్పయేత్=సమర్పింపవలెను; (అదీక్షితాచేత్= దీక్షనొందినది కానిచో, అళిపాత్రదానం ఏవ=అళిపాత్రదానమే)-

యథా - ఎట్లనగా;

ఓం ఐం హ్రీం శ్రీం – సుభగేదేవి = సౌభాగ్యదేవతా ! పేశితాన్వితం=నైవేద్య పేశముతో కూడిన, ఇదం అలిపాత్రం = ఈ అలిపాత్రను, తుభ్యం=నీకు, దీయతే = ఇయ్యబడుచున్నది. స్వీకృత్య= స్వీకరించి, యశః=కీర్తిని, దేహి= ఇమ్ము. రిపూన్= శత్రువులను, జహి= నశింపజేయుము; ఇతి మంత్రేణ= ఈ మంత్రముతో, సువాసిన్యై= సువాసినికి, అథవా= లేదా శ్రీదేవ్యై= శ్రీదేవికి, సమర్ప యేత్= సమర్పింపవలయును.

సా అపి= ఆమెయు, తత్= ఆ పాత్రను, సావశేషం= స్వీకృత్య= స్వీకరించి—

ఓం ఐం హ్రీం శ్రీం—

వత్స= వత్సా, తుభ్యం= నీకు, పీతశేషం – త్రాగగా మిగిలిన, కులామృతం= కులామృతమూ, యథాదత్తం= అట్లే ఇయ్యబడినది, త్వత్ + శత్రూన్= నీ శత్రువులను, సంహరిష్యామి=

సంహరించెదను, అహం= నేను, తవ= నీ యొక్క, అభీష్టం= అభీష్టమును, దదామి= ఇచ్చెదను.

ఇతి మంత్రేణ= ఈ మంత్రముతో, ప్రతిదద్యాత్= ప్రతి దానము చేయవలెను. తతః, తర్వాత, సాధకః = సాధకుడు సువాసినీం = సువాసినిని, భోజయిత్వా = భుజింపజేసి, సంతర్ప్య= తృప్తిపరచి. తాంబూలాద్యైః = తాంబూలాదులతో, సంతోషయేత్= సంతోషపరచవలెను.

## సామయిక పూజా

తతః, సంనిహితే గురౌ గురుసన్నిధానమున, గురుం నత్వా గంధ కుంకుమాదిభిరుపచర్య గురుపాదుకా మంత్రేణ అభిపూజ్య పాత్రాణి సమర్పయజేత్ । అసంనిహితే గురౌ స్వశిరపి గురుత్రయం యజేత్, ః సంనిహితాన్ సామయికా నాహూయ గంధ కుంకుమాది భిరుపచర్య పాత్రాణి దద్యాత్ । పశ్చాత్ తత్త్వ శోధనం కుర్యాత్ । సామయికాశ్చ పాత్రమాదాయ సమస్త ప్రకటేత్యాది సమష్టి మంత్రేణ పుష్పాంజలిం దత్వాస్వశిరసి గురుత్రయం హృదయే ఆత్మ చతుష్టయంచ ఇష్ట్వాద్దేవీం సంతర్ప్య తత్త్వశోధనం యదోపదిష్టం కుర్యుః॥

### *10)* సామయిక పూజా

తతః= తరువాత, సంనిహితే గురౌ = గురుసంనిధానమున, గురుం= గురువును, నత్వా= నమస్కరించి, గంధ – కుంకుమా

ధిభిః= ఉపచర్య= గంధ కుంకుమాదులతో ఉచరించి, గురుపాదుకా మంత్రేణ=గురుపాదుకలను మంత్రో, అభిపూజ్య= పూజించి, పాత్రాణి=పాత్రిలను, సమర్పయేత్= సమర్పింపవలయును. సంని హితాన్= సంనిహితులయిన, సామయికాన్ = సమయమునందు అక్కడున్నవారిని, ఆహూయ= పిలిచి, గంధ కుంకుమాదిభిః= గంధ కుంకుమాదులతో, ఉపచర్య= ఉపచరించి, పాత్రాణి=పాత్ర లను దద్యాత్= ఇయ్యవలెను. పశ్చాత్= తర్వాత, తత్త్వశోధనం= తత్త్వ శోధనము, కుర్యాత్= చేయవలెను, సామయికాః చ= సామ యికులును, పాత్రం ఆదాయ= పాత్ర తీసికొని, సమస్త ప్రకటే త్యాది సమష్టి మంత్రేణ= సమస్త ప్రకట-ఇత్యాదిక సమష్టి మంత్ర ముతో పుష్పాంజలిం= పుష్పాంజలిని, దత్వా= ఇచ్చి, స్వశిరసి= తన శిరమున, చతుష్టయం చ= చతుష్టయమును, ఇష్ట్వా= యాగము చేసి, దైవీం= దేవిని, సంతర్ప్య= సంతుష్టిచేసి, తత్త్వ శోధనం= తత్త్వశోధనము, యథోపదిష్టం= ఉపదేశానుసారముగ, కుర్యుః= చేయవలెను.

## పూజా సమర్పణ - దేవతోద్వాసనమ్

సాధువాఽసాధువాకర్మ యద్యదా చరితమ్ మయా తత్సర్వం కృపయాదేవి గృహాణారాధనంమమ॥ దేవనాథ గురో స్వామిన్ దేశిక స్వాత్మనాయక త్రాహి త్రాహి కృపాసింధో పూజాం పూర్ణ తరః కురు ఇతి దేవ్యా వామహస్తే పూజాం

సమర్ప్య శంఖముద్ధృత్య దేవ్యుపరి(త్రిః పరిభ్రామ్య తజ్జలం హస్తే సమాదాయ । సామయికానాత్మానం చ మూలేన,

ప్రోక్ష్య శంఖం ప్రక్షాళ్య విదధ్యాత్ ।

తతో మూలేన తీర్థ నిర్మాల్యే స్వీకృత్య—

ఓం ఐం హ్రీం శ్రీం జ్ఞానతో౽జ్ఞానతో వా౽పి యన్మయా చరితం శివేతవకృత్య మితిజ్ఞాత్వా క్షమస్వపరమేశ్వరి॥

ఇతి క్షమాప్య సర్వాసామావరణ దేవతానాం శ్రీదేవ్యంగే నిలయం విభావ్య.

ఓం ఐం హ్రీం శ్రీం హృత్పద్మ కర్ణికా మధ్యేశివేన సహాశంకరి ప్రవిశత్వం మహాదేవి సర్వైరావరణైః సహ॥

ఇతి తేజోరూపేణ పరిణతాం శ్రీదేవీం పూర్వవత్ హృదయం నీత్వాపునః ఆత్మాభిన్న సంవిద్రూపేణ భావయేత్॥

## 11) పూజా సమర్పణ దేవతోద్వాసనం

సాధువా = మంచిగాని, అసాధువా = అసాధువుగాగాని, కర్మ = కర్మ యద్యత్ = ఏది ఏది, మయా = నాచే, ఆచరితం = ఆచరింపబడినదో, తత్ సర్వం = అది అంతయు, దేవి = దేవీ ! కృపయా = దయతో మమ = నా యొక్క, ఆరాధనం = పూజను, గృహాణ = గ్రహింపుము.

దేవనాథ=దేవప్రభూ గురో స్వామిన్ = గురుస్వామీ, దేశిక=పూజ్యుడైన. స్వాత్మ నాయక=ఆత్మప్రభూ. కృపా సింధో=దయాసముద్రా । త్రాహి – త్రాహి=రక్షింపుము రక్షింపుము. పూజాం=పూజను. పూర్ణతరాం=పూర్ణమైన దానినిగా, కురు=చేయుము.

ఇతి=ఇట్లు. దేవ్యాః=దేవియొక్క. వామహస్తే=ఎడమ చేతియందు పూజాం=పూజను. సమర్ప్య=సమర్పించి. శంఖం=శంఖమును. ఉద్ధృత్య=పైకి ఎత్తి దేవ్యుపరి=దేవిపైన. త్రిః=మూడుసార్లు. పరిభ్రామ్య=త్రిప్పి. తజ్జలం–ఆ నీటిని. హస్తే=చేతియందు, సమాదాయ=తీసికొని సామయికాన్=సామయికులను, ఆత్మానం చ=తనను, మూలేన=మూలమంత్రముచే, ప్రోక్ష్య=చల్లి, శంఖం=శంఖమును, ప్రక్షాళ్య=కడిగి నిదధ్యాత్=ధరింపవలెను యథాస్థానమున ఉంచవలెను; తతః=తర్వాత, మూలేన=మూలమంత్రముచే తీర్థ పుష్పాణి=తీర్థమును పుష్పమును, స్వీకృత్య=స్వీకరించి.

ఓం ఐం హ్రీం శ్రీం—

శివే=ఓ దేవీ, జ్ఞానతః=తెలిసి, అజ్ఞానతః వా అపి=తెలియకగాని, మయా=నాచే, యత్=ఏది, ఆచరితం = ఆచరింపబడినదో, పరమేశ్వరి=పరమేశ్వరీ, తవ=నీ యొక్క, కృత్యం = పూజాకృత్యముగా, జ్ఞాత్వా=తలచి, క్షమస్వ=క్షమింపుము.

ఇతి=ఇట్లు, క్షమాప్య=క్షమార్పణచేసి, సర్వాసాం–ఆవరణ దేవతానాం=ఆవరణ దేవతలందరియొక్క, శ్రీ దేవ్యంగే=శ్రీదేవి యందు, విలయం=విలీనమగుట, విభావ్య=భావించి;

ఓం ఐం హ్రీం శ్రీం—

శంకరి=దేవీ, హృత్పద్మకర్ణికామధ్యే=హృదయ పద్మ కర్ణిక యొక్క మధ్యే=మధ్యయందు, శివేనసహ=శివునితోకూడ, త్వం=నీవు, మహాదేవి=మహాదేవీ, సర్వైః ఆవరణైః సహ=ఆవరణములన్నిటితో డను, ప్రవిశ=ప్రవేశింపుము.

ఇతి=ఇట్లు, తేజోరూపేణ=తేజోరూపముతో, పరిణతాం= పరిణమించిన, శ్రీదేవిం=శ్రీదేవిని, పూర్వవత్ = పూర్వమువలె హృదయం=హృదయమును నీత్వా=పొందిచి, పునః = మరల, ఆత్మాభిన్న సంవిద్రూపేణ = ఆత్మాభిన్నమైనబుద్ధి రూపముతో, భావయేత్=భావింపవలెను.

## శాంతి పాఠం

ఓంద్యౌః శాంతిరన్తరిక్షగ్ం శాంతిః పృథ్వీశాంతి రాపః శాంతి రోషధయః శాంతి వనస్పతయః శాంతి ర్విశ్వేదేవాః శాంతిర్బ్రహ్మ శాంతి సర్వగ్ం శాంతిః శాంతిరేవ శాంతి స్సామా శాంతిరేధి. శాంతిః, శాంతిః, శాంతిః ఓం. శుక్రవారమునాడు, అష్టమినాడు, పూర్ణిమనాడు, వీలునుబట్టి లలితాష్టోత్తర శతనామావళితోగాని, లలితా సహస్రనామ స్తోత్రముతోగాని, త్రిశతితోగాని, ఖడ్గమాలా స్తోత్రముతోగాని, సౌభాగ్య అష్టోత్తర శతనామావళితోగాని పసుపుతో చేయ బడిన కుంకుమతో పూజ చేయవలెను.

*12)* శాంతిపాఠః

ద్యౌః= (ఆకాశము) స్వర్గము, శాంతిః = శాంతి, అంత రిక్షం=ఆకాశము, శాంతిః=శాంతి, పృథ్వీ=భూమి, శాంతిః=శాంతి, ఆపః=నీరు, శాతిః=శాంతి, ఓషధయః=ఓషధులు, శాంతిః=శాంతి,

వనస్పతయః=వనస్పతులు (మారేడు, రావి, మర్రి, జువ్వి, జమ్మి, మొదలగు పువ్వు లేకుండగ ఫలించునవి) శాంతిః=శాంతి, శాంతిః=శాంతి, సా=ఆ శాంతి, మా=నాకు, శాంతిః=శాంతి అయి, ఏధి=ఉండుగాక, శాంతిః, శాంతిః, శాంతిః ఓమ్.

శుక్రవారమునాడు, అష్టమినాడు, పూర్ణినాడు - వీలునుబట్టి లలితాష్టోత్తర శతనామావళితోగాని, లలితాసహస్ర నామావళితో గాని, త్రిశతితోగాని, ఖడ్గమాలా స్తోత్రముతో గాని, సౌభాగ్యాష్టోత్తర శతనామావళితోగాని, పసుపుతో చేయబడిన కుంకుమతో - పూజ చేయవలెను.

## విశేషార్ఘ్యోద్వాసనమ్

మూలేన విశేషార్ఘ్య పాత్రం అమస్తకం ఉద్ధృత్య తీర్థం పాత్రంతరేణాదాయ-"ఆర్ద్రాం జ్వలతి" ఇతి మంత్రేణ ఆత్మనః కుండలిన్యగ్రే హుత్వా బ్రాహ్మణాన్ సువాసినీశ్చ భోజయిత్వా స్వయమపి భుక్త్వా యథా సుఖం విహరేత్॥

*విశేషార్ఘ్యోద్వాసనమ్*—

మూలేన = మూలమంత్రముతో, విశేషార్ఘ్య పాత్రను, అమస్తకం=శిరస్సు వరకు, ఉద్ధృత్య=ఎత్తి, తత్తీర్థం=ఆ తీర్థమును పాత్రాంతరేణ=మరియొక పాత్రతో, ఆదాయ=తీసికొని, "ఆర్ద్రాం జ్వలతి" ఇతి మంత్రేణ="ఆర్ద్రాంజ్వలతి" అను మంత్రముతో, ఆత్మనః=తన యొక్క కుండలిన్యగ్రే=కుండలిని అగ్రమున, హుత్వా=హోమముచేసి, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, సువాసినీశ్చ=ముత్తైదువలను, భోజయిత్వా = ఆరగింపచేసి, స్వయం అపి=తాను, భుక్త్వా=భుజించి, యథాసుఖం=సుఖముగా, విహరేత్=విహరింపవలెను.



డాక్టరు స్వామి జ్ఞానానందులు
(శ్రీనగరము - కాశ్మీరము - 1920)

# పరిశిష్టము 1

# శ్రీ స్వామీ జ్ఞానానందుల సంక్షిప్త జీవన చరిత్ర

శ్రీ స్వామి జ్ఞానానంద తెలుగుదేశంలో పుట్టడం తెలుగు వాళ్ళ గొప్ప అదృష్టం. మహద్భాగ్యం. దేవతలకు తెలుగుదేశం పైన ఎంత ప్రీతి ఉన్నదో అనిపిస్తుంది ఈ సంఘటన. భారతదేశ ఆధ్యాత్మిక మహాపథ యాత్రలో అపూర్వమూ అతులితమూ అయిన సన్నివేశం స్వామీ జ్ఞానానంద అవతరణం. ఒక వెయ్యి సంవత్సరాల చరిత్రలోనే గొప్ప ప్రాముఖ్యం గల ఘట్టం స్వామి వారి జననం. విశ్వ విజ్ఞాన శాస్త్రీయ ప్రాముఖ్యంగల గొప్ప శాస్త్రవేత్త శ్రీ స్వామి. అంతేకాదు అలనాడు ఆదిశంకర భగవత్పాదులవలె అధునికులలో రమణ మహర్షి వలె గొప్ప జ్ఞాని. ఆరూఢ పరతత్త్వానుభూతి సాధించిన సంయమి. ఋషిపుంగవుడు. ఉన్నతోన్నత ఆధ్యాత్మిక తపోవిభవుడు. అవధూత.

హేతువాదులు నాస్తికులు ప్రత్యక్ష ప్రమాణవాదులు నిరీశ్వరవాద ప్రచారకులు అజ్ఞేయతావాదులు కార్యకారణ ప్రమాణ వాదులు ఎందరెంత ప్రచారం చేసినా భారతదేశంలో శంకరభగవత్పాదుల వారినుండి నేటివరకు తెలిసిన చరిత్రలో ఈ కంటికి కనపడే మూలతత్త్వాన్ని గవేషించి పరమార్థం తెలుసుకున్న మహనీయు లెందరో ఉన్నారు. అధునిక కాలంలో త్రైలింగ స్వామి, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ మొదలైన

వారి శ్రేణిలోని మహనీయులు స్వామి జ్ఞానానంద. వీరికెవ్వరికీ లేని విలక్షణత కూడా స్వామివారి మూర్తి మంతంలో కనపడు తుంది. అదేమిటంటే ఆధునిక ప్రపంచపు ఉనికిని నేడు అను శాసిస్తున్న పరమాణు భౌతిక విజ్ఞాన (న్యూక్లియర్ ఫిజిక్స్) శాస్త్రవేత్తలలో శ్రీ స్వామివారికి విశిష్టమైన స్థానమున్నది. ఇది అపూర్వమూ, అత్యద్భుతమూ, పరమాశ్చర్యకరమూ అయిన విషయం పరమాణు భౌతిక విజ్ఞాన ప్రాథమిక విషయాలను గురించి స్వామి రచించిన నూరింటికిపైగా వ్యాసాలు 'ఎలిమెంట్స్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్' పేరిట విశ్వవిద్యాలయ పరమాణు భౌతిక విజ్ఞానశాస్త్ర విద్యార్థులకు పాఠ్యపుస్తకం జ్ఞానవిజ్ఞానాల సదాశివస్వరూపం శ్రీ స్వామి. ఆయన వ్యక్తావ్యక్త, సగుణ నిర్గుణ, ప్రకృతిపురుష, శక్తిశాక్త ఉపాసనల సమగ్రసమన్వయ జ్ఞానావధి, స్థితప్రజ్ఞులు, పూర్ణపురుషులు, అద్వైతదర్శనావధి. ఈ ఇరవయ్యో శతాబ్దిలో ఇటువంటి మహాత్ముడి జీవిత చరిత్ర అనన్యం. మహా మహిమోపేతం, వాచామగోచరం

'శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతం' అనే తెలుగు గ్రంథం 1972 లోనూ మరల 1985 లోనూ వెలువడింది. ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ గోదావరి జిల్లాలో గౌరగనమూడి అనే గ్రామం వుంది. అక్కడి శ్రీరామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్ అనే ప్రచురణ సంస్థద్వారా ఈ గొప్ప పుస్తకం వెలువడింది. ఈ గ్రంథంలోని ద్వితీయాధ్యాయంగా శ్రీ స్వామి జ్ఞానానంద యతి

చంద్రుల స్వీయచరిత్ర కథనం నిబద్ధమైంది. తెలుగువాళ్ళంతా కళ్ళకద్దుకొనవలసిన గ్రంథం ఇది. భౌతిక ప్రపంచ, ఆధ్యాత్మి కానుభవ సంశ్లేషణం, విస్మయకరమైన విషయాలు. శాస్త్ర విజ్ఞాన వేదాంత దర్శనాల పరమగమ్యం ఒకటేనన్న సంగతులు ఈ చిన్న గ్రంథం ద్వారా సూటిగా సరళంగా తేటతెల్లంగా జిజ్ఞాసువులు తెలుసుకో గలుగుతారు.

## జననం, బాల్యం, విద్యోపార్జన

పశ్చిమగోదావరి జిల్లా భీమవరానికి కొద్ది దూరంలోవున్న గొరగనమూడిలో శ్రీ భూపతిరాజు శ్రీ రామరాజు, సీతయమ్మ అనే పుణ్యదంపతులకు లక్ష్మీనరసింహరాజు అనే పూర్వాశ్రమ నామంగల స్వామి జ్ఞానానంద 1896 వ సంవత్సరం డిసెంబర్ 5 వ తేదీన జన్మించారు. సమస్తమైన సంపదలకు నిలయమైన వంశం వీరిది యోగమూ భోగమూ సమసించిన జ్ఞానసంపద కలవారు తండ్రిగారు. ధనధాన్య సమృద్ధమైన కుటుంబంలో అలనాడు శుద్ధోధన మహారాజుకు గౌతముడిలా జన్మించినా శ్రీ లక్ష్మీ నరసింహరాజు చిన్నతనంనుంచీ కూడా ఐహిక సుఖ విముఖులు గానే ఉండటం గమనార్హం.

స్వగ్రామానికి మూడు మైళ్ళ దూరంలో వున్న వీరవాసరంలో శ్రీ లక్ష్మీనరసింహరాజు గారి ప్రాథమిక విద్యా భ్యాసం జరిగింది. అటు తర్వాత వీరి విద్యా వికాస సంరక్షకులుగా

ఉన్న సూరంపూడి సీతారామయ్య మేష్టారు తణుకు స్కూలుకు బదిలీకాగా శ్రీ లక్ష్మీనరసింహరాజుగారుకూడా తణుకు హైస్కూలులో ఫస్ట్‌ఫారంలో చేరారు. అప్పుడు స్వామివారికి 12 సం॥ల వయసు. తణుకు స్కూలులో స్వామి చదువుతుంటున్న రోజులలో మహారాష్ట్రమునుంచి ఒక స్వాములవారు తెలుగునాడును పర్యటించడం జరిగింది. ఆ స్వామివారు తణుకు కూడా వచ్చారు. శ్రీ లక్ష్మీనరసింహరాజు ఆ మహారాష్ట్ర స్వామివారిని దర్శించారు. ఆ స్వాములవారు వీరికి శ్రీ కృష్ణమంత్రోపదేశం చేసినట్లు స్వామి జ్ఞానానంద జీవిత చరిత్రలో ఉల్లేఖ్యం శ్రీ లక్ష్మీనరసింహరాజు తణుకులో రెండేళ్ళు మాత్రమే హైస్కూలు తరగతులలో చదివారు. ఆటు తర్వాత వారి విద్యాభ్యాసం నరసాపురం టైలర్ హైస్కూలులో కొనసాగింది. ఉన్నత పాఠశాల తరగతులలో చదువుతున్నప్పుడే తక్కిన విద్యార్థులకన్నా స్వామివారి వైఖరి విలక్షణంగా వుండేది. ఆటపాటల్లో ఆయనకు అభిరుచివుండేదికాదు. ఎప్పుడూ పుస్తక పఠనం పట్ల చాలా ఆసక్తి చూపేవారు. హైస్కూలు ఉన్నత తరగతుల విద్యార్థులకు ఒక చర్చా సంఘం ఏర్పరచి వక్తృత్వ పోటీలు నిర్వహిస్తూ ఈ సంఘానికి శ్రీ లక్ష్మీ నరసింహరాజు అనే పూర్వాశ్రమ నామంగల స్వామి జ్ఞానానంద నాయకులుగా ఉండేవారు. స్కూల్లో చదువుకొనే రోజుల్లొ ఆయనకు భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం చాలా అభిమాన విషయాలు. వీటిలో ఆయనకెప్పుడూ చాలా మంచి మార్కులు వస్తూ వుండేవి.

తెలుగుదేశంలో ఆనాడు చాలా ప్రసిద్ధి పొందిన హెడ్మాస్టరు అంబరుఖానా జయరామారావుగారు అప్పుడు నరసాపురం హైస్కూలు హెడ్మాస్టరుగా ఉండేవారు. ఫిజిక్సు కెమిస్ట్రీలలో నూటికి నూరు మార్కులు వచ్చినా ఇంగ్లీషులో మంచిమార్కులు రాకపోతే పరీక్షకు పంపను అని హెచ్చరించేవారు ఆ హెడ్మాస్టరు గారు విద్యార్థులను.

స్వామి జ్ఞానానంద బాల్యం కౌమారం గూడా ఆయన అచ్ఛశీలాన్ని, కరుణా తరంగితార్ద్ర హృదయాన్ని ప్రస్ఫుటీకస్తు న్నాయి- దీనులపట్ల కరుణ, అసహాయులపట్ల అభిమానం, దాన ధర్మ దయాశౌచాది గుణాలు స్వామివారి కౌమార జీవిత ఘట్టాల్లో ప్రకాశిస్తున్నాయి. స్వామివారి ఐహిక జీవిత విస్పృహ ఆధ్యాత్మ కానుభవాసక్తి జాతకంలో దైవజ్ఞులు భవిష్టీకరించిన సూచనలు తూడగా తండ్రిగారైన శ్రీ రామరాజుగారికి కుమారుడి వివాహం చేయటం ఆవశ్యకమని తోచివుంటుంది. అలనాడు కపిల వస్తుపుర వరాధీశుడైన శుద్ధోధన మహారాజు కూడా అట్లానే ఆలోచించాడు. శ్రీ లక్ష్మీ నరసింహరాజుగారికి తల్లితండ్రులు చిన్నతనంలోనే వివాహం చేశారు. కొమరగిరి పట్నం వాస్తవ్యులైన శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారి పుత్రిక సోమావతమ్మగారికి లక్ష్మీనరసింహరాజు గారికీ వివాహం శ్రీరామకృష్ణ పరమహంస శ్రీ శారదామాతలకు వివాహం జరిగినట్లే జరిగింది కాని శ్రీజ్ఞానానందస్వామి ఆజన్మ పరివ్రాజకులుగానే ఉండిపోయినారు. వీరితో హైస్కూలు తరగతులు

చదివిన శ్రీ మంతెన గోపాలరాజుగారు స్వామివారి పూర్వాశ్రమ జీవితాన్ని గూర్చి ఇట్లా పేర్కొన్నారు. "వీరి జనకులైన శ్రీరామ రాజుగారు బలవంతమున ఈయనకు వివాహము గావించినను గృహస్థ జీవితము నందీయనకేమాత్రము అనురాగము లేనికతమున పరమార్థ చింతనతో జీవితమును గడుపుమని భార్యకు హితోప దేశము గావించి సర్వసంగ పరిత్యాగమునల్పి హిమాలయ తపో భూముల కేగిరి." (పుట 17, స్వామి జ్ఞానానంద చరితామృతము, ప్రథమ ముద్రణం—1972).

1917 వ సంవత్సరం స్వామి వారు స్కూలుఫైనలు పరీక్ష రాశారు. ఆ సంవత్సరం నరసాపురం హైస్కూలు నుంచి ముగ్గురు మాత్రమే ఈ పరీక్షలో కృతార్థులైనారట ఉత్తీర్ణులైనవారిలో శ్రీ స్వామి నెంబరులేదు. స్వామివారికీ సన్నివేశం మంచి అవకా శంగా పరిణమించింది. విరక్తితోవారు ఎక్కడికో వెళ్ళి పోయి నారు. వారు కలకత్తా చేరారు. తండ్రిగారు కుమారుడికోసం ఎంత గానో వెతికించారు. తహతహలాడారు. శ్రీ లక్ష్మీనరసింహరాజు గారి సహాధ్యాయి, అంతరంగిక మిత్రుడు అయిన ములకుట్ల వీరన్నను ఎలాగైనా తమపుత్రుడి ఉనికిని తెలుసుకొని తీసుకొని రావల్సిందిగా శ్రీ రామరాజుగారు నిర్బంధించారు శ్రీ లక్ష్మీ నరసింహ రాజుగారు కలకత్తాలో దక్షిణేశ్వరంలోని శ్రీ రామకృష్ణ కేంద్రం చేరుకొని వివేకానందబ్రిదర్‌హుడ్ వారిచ్చే పండ్లు రొట్టెలు తీసుకుంటూ ఆధ్యాత్మిక గవేషణలో ఉన్నారు. అప్పుడు

శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యసమూహ్యలో ఒకరైన స్వామి శివానంద బేలూరు మఠానికధిపతులుగా ఉండేవారు. వారు శ్రీ లక్ష్మీ నరసింహరాజుగారి నెంతగానో ఆదరించి ఆధ్యాత్మిక శిక్షణనిస్తూ వచ్చారు. ఇంతలో గొరగనమూడి నుంచి ములుకుట్ల వీరన్న వెతుక్కుంటూవచ్చి కలకత్తాలో బేలూరు మఠంలో తమ మిత్రుని జాడాతీయగలిగారు. స్వామి శివానందను ఎంతగానో ప్రార్థించి తమ మిత్రుడిని తనవెంట గొరగనమూడికి పంపవలసిందిగా ప్రాధేయపడ్డారు అప్పుడు స్వామి శివానంద శ్రీ లక్ష్మీనరసింహ రాజుగారిని ఇంటికి వెళ్ళవలసిందిగాను భగవదాదేశంతో కూడిన పిలుపు త్వరలోనే అందగానే బయలు దేరవలసిందిగాను అనుగ్ర యించారు. తాము స్వగ్రామం తప్పక వస్తామని మాటయిచ్చి మిత్రుణ్ణి ముందుగానే ఇంటికి పంపివేసి స్వామివారు అన్నట్లుగా స్వగ్రామం చేరారు తండ్రిగారైన శ్రీ రామరాజుగారు కుమారుని రాకకు సంతోషించి గృహ నిర్వహణ భారంతో ఆయన్ను పూర్తిగా కట్టివేస్తే ఇంటివద్దనే వుండిపోతారన్న భ్రమతో ఇంటి పెత్తనమంతా ఆయనకు వప్పగించారు. శ్రీ లక్ష్మీనరసింహరాజు గారు ఈ సన్నివేశానికి నొచ్చుకున్నారు. కొద్ది నెలలు ఈ విధంగా గడవగా దూరాన ఒక వెలుగు ఆయనకు కనపడి గృహత్యాగానికి సమయం మాసన్నమైన సంగతి బోధించడం జరిగింది 1917 డిశంబర్ 14 వ తేది పింగళినామ సంవత్సర కార్తీక బహుళ అమావాస్య అర్థరాత్రి ఎవరికీ తెలియకుండా స్వామివారు ఇల్లు విడిచి పెట్టారు.

## హిమాలయో నామ నగాధిరాజః

అమావాస్య అర్ధరాత్రివేళ ఇల్లువిడిచి కొద్ది దూరం రైలు మీదనూ చాలాభాగం కాలినడకను ఆరు వందల మైళ్ళు ప్రయాణం చేసి స్వామి ఖర్గపూర్ చేరుకున్నారు. నేపాల్ వెళ్ళి అక్కడ అరణ్యాలలో తపస్సు చేసుకోవాలని వారి సంకల్పం. ఈ విధంగా భారతదేశం సరిహద్దుదాటి నేపాల్ ప్రవేశించి అరణ్యంలో తపస్సు చేస్తుండగా ముజఫర్‌పూర్ వాస్తవ్యుడైన ఒక శ్రీమంతుడు వేట కోసం వచ్చి క్రూరమృగాలతో నిండివున్న ఈ అరణ్యం కన్నా హరిద్వారం హృషీకేశం తపస్సుకు అనువుగా వుంటాయి అని నచ్చచెప్పి స్వామివారిని తనతో తీసుకొని వెళ్ళటం జరిగింది. అక్కడి నుంచి స్వామి కాన్పూరు. ఢిల్లీ వెళ్ళటం జరిగింది. యమునా నదీతీరంలో ఒక సాధకుడితో కొన్నాళ్ళు రెల్లుకుటీరంలో గడిపారు స్వామి అక్కడికి దగ్గరలోనే ఉన్న విక్టోరియా గార్డెన్స్ లోని హార్డింజ్ లైబ్రరీలో ఏకదీక్షతో "ప్లేటోస్‌రిపబ్లిక్" నాలుగు సంపుటాలు చదివారు. స్వామి ఆరోజుల్లో సాధుసన్యాసుల పైన కూడా ప్రభుత్వపు గట్టినిఘా ఉండేది. స్వాతంత్ర్యోద్యమంలో వీరిది కూడా కీలకమైన పాత్ర వుండవచ్చునని ప్రభుత్వపు అనుమానం. స్వామి వారిని డిటెక్టివ్‌లు వెన్నంటడం కూడా జరిగింది. అక్కడి నుంచి స్వామివారు ఒక ఆర్యసమాజ మిత్రుడితో హరిద్వారం చేరుకున్నారు. అక్కడినుంచి ఋషీకేశంలోని

స్వర్గాశ్రమం చేరుకున్నారు. కాని అక్కడి వాతావరణం వారికి సంతృప్తిని కలిగించలేదు. నిర్జన ప్రదేశంలో తీవ్రమైన తపస్సాధనకు పూనుకోవాలన్న కోరికతో రాజపుటానాలోని అబూపర్వతము చేరుకున్నారు అబూ పర్వతము మీద దూధ్ బావిడి అనే ప్రాంతంలోని ఒక గుహలో స్వామి తీవ్రంగా తపస్సు చేయసాగిరి. ఇక్కడ ఒక విచిత్ర సంఘటన జరిగినది. పగలంతా అరణ్యములోను రాత్రి గుహలోనూ స్వామి వారు తపస్సు చేసుకుంటు కాలం గడిపారు.

ఒకరోజు గుహలో జ్ఞానానందస్వామి వారు తపస్సు చేసుకుంటూ వుండగా ఒకవైపు గోడమీద పైభాగంలో అతికించిన ఒక కాగితం పైన మట్టి రాలిపోయి అక్కడ ఉన్న ఒక చిన్న గూటి నుంచి ఒక గుడ్డలమూట వూడిపడింది. ఆ మూటను విప్పి చూడగా అందులో చాలా పొడపైన ఒక రక్ష రేకు కనపడినది. ఆ రక్షరేకు మధ్య "విజయ" అనే తెలుగు అక్షరాలున్నాయి. దీని చుట్టూ ఏవో యంత్రాలు నిగ్రహాలు ప్రాచీనలిపిలో ఏవోఅక్షరాలూ ఉన్నాయి. యంత్రం చుట్టూ ఒక కాగితం చుట్టివున్నది. ఆ కాగితం విప్పి చూస్తే అందులో "ఎవరు దీన్ని మూడురోజులు శ్రద్ధతో ధరిస్తారో వాళ్ళ కోరికలు సిద్ధిస్తాయి" అని వ్రాసి ఉంది. ఈరక్ష రేకు వృత్తాంతం ఇప్పటి హేతువాదులు నమ్మరు. నమ్మకపోవటం కూడా సహజమే కావచ్చు. కాని ఈ స్వీయ చరిత్ర చదివితే ఇటు వంటి అద్భుతమైన విశేషాలు ఎన్నో వున్నాయి. కేవలం కుతూహలం కొద్దీ యీ రక్షరేకును మూడు రోజులు ధరించారు స్వామి

వారు. మూడోరోజు పూర్తి అవుతున్నదనగా స్నానం చేస్తూ ఒక చెట్టు కొమ్మమీద యీ రక్షరేకును భద్రపరచగా అది కాస్తా మాయమైపోయింది. ఈ ఆబూ పర్వతం పైన చిత్ర విచిత్రమైన సిద్ధులు మహిమలు చూపిన ఒక మహామ్మదీయ సిద్ధ పురుషుడి విచిత్రోదంతాన్ని స్వామి జ్ఞానానంద స్వీయ చరిత్రలో ప్రస్తావించారు.

ఆబూపర్వతంపై తపస్సు చేసిన తర్వాత స్వామి మళ్ళా ఋషీకేశం వెళ్ళి అక్కడ స్వర్గాశ్రమంలో తీవ్ర సాధనలు చేసారు. అప్పటి కాయన వయస్సు ఇరవైమూడు సంవత్సరాలే. ఇక్కడ స్వామివారికి వంగ దేశీయులైన శరత్ చంద్రసేన్ అనే గొప్ప సాధకులతో సాన్నిహిత్యం లభించింది. శరత్‌చంద్రసేన్ మహాశయులు సన్యసించిన తరువాత పూర్ణానందులుగా యోగపట్ట విభూషితులైరి. అటు తర్వాత వీరివద్దనే మన స్వామి జ్ఞానానంద సన్యాస దీక్ష స్వీకరించటం జరిగింది. అప్పుడే వారి పేరు స్వామి జ్ఞానానందగా మారినది.

ఇటు తర్వాత నాలుగైదు సంవత్సరాలు స్వామి జ్ఞానానంద భారతదేశ ఉత్తర సరిహద్దులలో పుణ్యాశ్రమాలలో ఆచరించిన తపస్సు అనితరసాధ్యమైనదీ అద్భుతమైనది. కాశ్మీరంలో ఆయన తీవ్రతపశ్చర్యకు పూనుకున్నారు. స్వామి జ్ఞానానంద ఇరవై అయిదవ ఏట సన్యాసాశ్రమ స్వీకారం చేసారు. ఆటుతర్వాత

కొద్ది రోజులు కాశీలో గడిపారు. స్వామివారు కాశీలో ఉండగా ఇల్లు విడిచిన నాలుగు సంవత్సరాలకు ఆయన ఉనికిని గొరగన మూడిలో తండ్రిగారు తెలుసుకొని ముఖ్య బంధువులను తీసుకొని వచ్చి స్వామివారిని ఒక్కసారి ఇంటికి వచ్చి వెళ్ళవలసిందిగా ప్రార్థించారు తండ్రిగారు. వారివెంట వచ్చిన బృందంతోపాటు స్వామివారు తాముకూడా కలకత్తా వెళ్ళి అక్కడ తమ గురువుగా శైవ స్వామి పూర్ణానందుల అనుజ్ఞతో దీక్షానంతరము స్వామివారు మొట్టమొదటిసారి ఆంధ్రదేశము వచ్చిరి.

1923వ సంవత్సరము నుంచి మళ్ళీ నాలుగు సంవత్సరాలు హిమాలయ సానుసీమంలో స్వామివారు చేసిన తపస్సు అత్యంత అద్భుతమైనది. అత్యంత విస్మయకరమైనది. గంగోత్తరి సమీపంలో స్వామివారు సాగించిన తపస్సు వారి మాటల్లోనే వర్ణించాలంటే "మంచు ఇంకను పడుచునే యుండెను. తీవ్రముగ తపము ప్రారంభించితిని. వారము దినములగునరికి శరీరమున అమితమైన తేజస్సు వేడిమి కలిగెను. ఒడలిమీద నున్న వస్త్రములను పూర్తిగ విసర్జించితిని. దివారాత్రములు తపంబాచరించుచుంటిని. మహాద్భుతముగా నుండెను. (పుట 76-1972). బదరీ కేదారం మానస సరోవరం టిబెట్టు గోముఖ కైలాసాలలో పూర్తిగా అవధూత స్థితిలో అంటే దిగంబరముగ తీవ్రమైన తపస్సు చేశిరి స్వామి. అక్కడ నీటికన్నా గాలి 10, 15 డిగ్రీలు అతిశీతలంగా ఉంటుందట. నదులన్నీ గడ్డ కట్టుకొనిపోయే తీవ్ర శీతలం. ఈ భరించరాని చలిలో సాధువులు సన్యాసులు స్వామివారి ఒంటిని

తాకి కొంకర్లు పోయిన తమ శరీరాలను వెచ్చ చేసుకొనేవారుట. రోజుల తరబడి సమాధిస్థితిలో మంచు గుహలలో స్వామివారు తపస్సు చేయుటం నేటి హేతువాద యువతరం ఏ విధంగా సమన్వయం చేయగలదో మరి! స్వామి ఈ విధంగా ఒక దృశ్యాన్ని స్వీయ చరిత్రలో వర్ణించారు.

"అలకనంద సరస్వతీ నదుల సంగమ స్థానమును 'గణేశ ప్రయాగ' యందురు. ఇట సుమారు వెయ్యి అడుగుల ఎత్తున నున్న పర్వతము నెక్కితిని. సముద్ర మట్టమునకు 12,000 అడుగుల ఎత్తు. ఏమని చెప్పుదును! ఇచట ఒక మైదానము కలదు. ఆ పెద్ద మైదానమంతయు మెత్తని పచ్చగడ్డి అర అంగుళము ఎత్తున పెరిగి రంగురంగుల పుష్పములతో రత్నకంబళములు పరచినటుల ఎంతో రమ్యముగను, మహాశ్చర్యకరముగను సమ్మోహన కరముగను నుండెను" (పుట 89.)

18,000 ల అడుగుల ఎత్తున ఉన్న మానాఘాట్ దాటి టిబెట్‌లో ప్రవేశించి కైలాస మానస సరోవరం యాత్ర చేసారు స్వామి. దిగంబరంగా తపస్సు చేయగల సాధనాస్థితిని ఇట్లా వర్ణించారు స్వామి.

"తీవ్రసాధనా బలమున అంతరమందే అత్యుష్ణము బయలుదేరి శీతోష్ణముల కతీతమైన క్షుత్పి పాసల స్ఫురణలేని దేహాతీత భావము ప్రజ్వరిల్లిన సాధకులకు సహజ దిగంబరత్వ మేర్పడును"

# జర్మనీ, ఇంగ్లండ్, అమెరికా

ఇటువంటి అవధూత స్వామివారు 1927వ సంవత్సరములో "పూర్ణసూత్రములు" అనే యోగసాధనాభ్యసన గ్రంథాన్ని జర్మనీలో అచ్చు వేయించాలని సంకల్పించి యూరోపు వెళ్ళి అక్కడ గొప్ప విజ్ఞానశాస్త్రవేత్త రూపొందటం ప్రపంచ ఆధ్యాత్మిక సాధన చరిత్రలోనే అపూర్వం. స్వామివారే ఒకసారి ప్రస్తావితంగా ఇట్లా అన్నారు. 'విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ కఠోరతపశ్చర్యను, సన్యాస దీక్షను తలచి ఆశ్చర్యపడతారు. సన్యాసులు తమ శాస్త్రవిజ్ఞాన కృషిని గూర్చివిని ఆశ్చర్యం చెందుతారు రెండూ నిర్గుణ సగుణ వ్యక్తావ్యక్తతత్త్వ స్వరూపావిష్కరణ మార్గాలే. శాస్త్ర విజ్ఞానానికి ఆధ్యాత్మిక విద్యకూ సీమా భూమి ఒకటే అంటారు స్వామివారు.

స్వామి జ్ఞానానంద జీవితంలో 1896 నుంచి 1917 వరకు ఒక ఘట్టం. 1917 నుంచి 1927 వరకు తీవ్ర తపశ్చర్యా ఘట్టం. 1927 నుంచి 1947 వరకు అత్యున్నతస్థాయిలో వారు పరమాణు శాస్త్ర విజ్ఞాన ప్రయోగాలు జరిపారు. స్కూల్ ఫైనల్ పరీక్షతో విద్యాభ్యాసం ఆపివేసిన స్వామివారు జెకోస్లావేకియాలోని ప్రాగ్ నుంచి డి. ఎస్‌సి. బ్రిటన్‌లోని లివర్‌పూల్ యూనివర్సిటీ నుంచి పిహెచ్. డి. పట్టాన్ని పొందడం అద్భుతావహం. ప్రపంచంలో భౌతిక శాస్త్ర విజ్ఞానవేత్తలకు లభించే అత్యున్నత పురస్కారాలు స్వామివారు పొందారు. న్యూట్రాన్‌ను ఆవిష్కరిం

చిన సర్ జేమ్స్ చాడ్విక్‌తో లండన్‌లో కలసి పనిచేసి ఆయన మెప్పుకు పాత్రులైనారు. లండన్‌లోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్ ఫెలోషిప్ పొందారు, యూరప్‌లో ఇంగ్లండ్‌లో అమెరికాలో పరమాణు భౌతిక విజ్ఞానాన్ని గూర్చి అద్భుతమైన పరిశోధనలు జరిపారు. అంతర్జాతీయ శాస్త్ర విజ్ఞానులకు లభించే అత్యున్నత పురస్కారాలు పొందారు అమెరికా దేశపు అత్యున్నత పురస్కారమైన 'మెంబర్ సిగ్మాక్సై' అయినారు

ప్రాచీనకాలంలో కణాదుడు, బ్రహ్మగుప్తుడు అనే వేదాంతులు శాస్త్రజ్ఞులు అణు విజ్ఞానాన్ని ఆవిష్కరించారు. అటు తర్వాత కొన్ని వేల సంవత్సరాలకు స్వామి జ్ఞానానంద గొప్ప శాస్త్రవేత్తగాను పరమోదార పరమార్థైకకర తపస్విగాను మన కళ్ళముందు ఈ శతాబ్దంలో విలసిల్లుట చాలా విశిష్టమైన సంగతి.

రెండవ ప్రపంచ యుద్ధ కాలములో స్వామివారు జాతీయ భావాలను వెల్లడించటం బ్రిటిష్ ప్రభుత్వానికి అవాలు నమిలినట్లైంది. ఆయనపై ఈర్ష్య వహించారు. 1947 వ సంవత్సరం భారతదేశం స్వాతంత్ర్యం పొందటంతో పండిత జవాహర్‌లాల్ నెహ్రూ కోరికపై స్వామి ఢిల్లీలో నెలకొన్న నేషనల్ ఫిజికల్ లేబరేటరీస్‌లో పరమాణు భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్తగా శాఖాధిపత్యం వహించారు. అటు తర్వాత 1954 నుంచి సుమారు 10 సం॥లు ఆంధ్ర విశ్వవిద్యాలయ పరమాణు భౌతిక విజ్ఞాన విభాగం ఆచార్యులుగా, అధిపతిగా ఆ శాఖకు అఖిల భారత అంతర్జాతీయ గౌరవానికి పాత్రం చెయ్యటం తెలుగువాళ్ళంతా గర్వించవలసిన విషయం.

# జ్ఞాన విజ్ఞాన సమన్వయం

జర్మనీలో స్వామివారు శాస్త్ర విజ్ఞానపు ప్రయోగాలు చేస్తున్న సమయంలో సుభాస్ చంద్రబోస్ ఒకసారి వారిని విందు కాహ్వానించారు పరమ తపస్వి, ఉన్నతోన్నత విజ్ఞాన శాస్త్రవేత్త, ఆచార్యవర్యుడు స్వామి జ్ఞానానంద. పది సంవత్సరాల కాలవ్యవధి లోనే స్వామి జ్ఞానానంద పర్యవేక్షణలో ఇరవై మంది వరకు పరిశోధన విద్యాంసులు డాక్టరేట్ పట్టాలను పొందారంటే ఆ మహనీయుని ప్రతిభ, మేధ ఎటువంటివో అవగాహన చేసికొనవచ్చు.

1965 లో పదవీ విరమణ చేసినా వారు ఆంధ్ర విశ్వవిద్యాలయ గౌరవాచార్యులుగా ఉంటూనే పరమాణు భౌతిక విజ్ఞానాన్ని విస్తరింపచేశారు. న్యూక్లియర్ ఫిజిక్స్ పైనా, యోగశాస్త్రం గురించి, వేదాంతం, తత్త్వదర్శనం గురించి స్వామివారు రచించిన గ్రంథాలెన్నో దేశవిదేశాలలో ప్రకటితమైనవి. సర్వేపల్లి రాధాకృష్ణయ్యవంటి తత్త్వవేత్తలు శ్రీ స్వామివారి గ్రంథాలను ఎంతో శ్లాఘించారు. నావ్యతో దర్శనీయమైన ప్రతిభా సమగ్ర స్వరూపం స్వామివారిది. జ్ఞాన విజ్ఞాన సమన్వయం ద్వారా పుడమికిన్ స్వర్గమున కొక్క మ్రుడి రచించిన బ్రహ్మజ్ఞాని శ్రీ స్వామి జ్ఞానానంద. స్వామివారి మహానిర్యాణం 1969 సెప్టెంబర్ నెల, 21వ తేది.

(ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం 19–8–1984)

**డా॥ అక్కిరాజు రమాపతిరావు**

**శ్రీరామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్**

*గొరగనమూడి వారి అనుమతిని*

# పరిశిష్టము 2

శ్రీ విద్యారణ్యస్వామి యొక్క జననము క్రీ. శ. 1267వ సంవత్సరము. ఆయన సన్యాసాశ్రమము తీసుకొని శారదా పీఠము యొక్క అధక్ష్యతను 1331 సంవత్సరములో తన 64వ యేట దీక్షతను వహించి, 1386 సంవత్సరమున తన 120వ సంవత్సరములో సిద్ధి పొందెను. వారి ఆరాధన ఇప్పటికిని ప్రతి సంవత్సరము శృంగేరీ మఠమున జ్యేష్ఠ శుక్ల త్రయోదశినాడు జరుపబడును. వారి గురువులు విద్యాశంకరులు క్రీ. శ. 1228 మొదలు 1231 వరకు శృంగేరీ పీఠాధిపతిగా ఉండెను. విద్యారణ్యులు కర్నాటక దేశస్థులు. వారి తల్లి శ్రీమతి తండ్రి మాయన. వారి తమ్ముళ్లు శాయనాచార్యుడు (వేదవ్యాఖ్యాత) మరియు సోమనాథుడు.

ఆయన తైత్తరీయ యజుశ్శాఖీయుడు. భరద్వాజసగోత్రీయుడు. ఆయన మాధ్వాచార్యుడు అనియు, మాధవాచార్యుడు అనియు మాధ్వామాత్యుడ, అనియు పిలువబడెడివాడు. వారి సన్యాసినామము విద్యారణ్యస్వామి, ఆయన విద్యా గురువు పండిత సర్వజ్ఞ విష్ణువు ఆయన తన 40-50 సంవత్సరముల మధ్యన వివాహము, ప్రస్తుతము బదామి లేక బాదలీ అని పిలువబడు వటలియునం అను చాళుక్య రాజు యొక్క మంత్రి యొక్క కుమార్తె విట్టియోత్రిని వివాహమాడెను. ఆయన హంపీ క్షేత్రములోని.

భువనేశ్వరి గుడిలో గొప్ప తపస్సు చేసెనని వినికిడి. శ్రీ విద్యా తీర్థ అను పేరుతో శంకర పీఠమును, అధిష్ఠించి 1336వ సంవత్సరములో విద్యారణ్యస్వామి విరూపాక్ష స్వామి దేవాలయమునకు పునాదులు వేసెను. బళ్ళారి జిల్లాలోని తుంగభద్రానది యొడ్డున ఆ దేవాలయమును స్థాపన చేసి, బుక్కభూపతికి రాజ పట్టాభిషేకము చేసెను. శ్రీ విద్యారణ్యస్వామి విజయనగరసామ్రాజ్యము యొక్క రాజులకును, రాజకుమారులకును ప్రధానామాత్యుడుగా ఉండెను. బుక్కభూపతి యొక్క ఆజ్ఞపై శ్రీ విద్యారణ్యస్వామి శ్రీ చక్రప్రచారము చేసెను. ఆ సందర్భమున పై చెప్పబడిన విరూపాక్షస్వామి గుడిమీద ఒక పెద్ద శ్రీచక్రమును తన యిష్టము వచ్చినట్లు నిర్మాణము చేసెను. ఆ శ్రీచక్రములో 8 ఏనుగులను, 8 సర్పములను 8 దిశలలోను, నిర్మించెను. ఆ శ్రీచక్రము యొక్క బిందుస్థానమున, సుమారు 2 మీటర్ల పొడవు గల ధాతు-కలశను రూపొందించెను !

విద్యారణ్యుల 50 సంవత్సరముల శృంగేరీ పీఠాధిపత్య కాలములో విజయనగర రాజులకును, రాజకుమారులకును మహామంత్రిగా ఉండెను. ఆ కాలములో విజయనగర సామ్రాజ్యము యొక్క ఖ్యాతి పాశ్చాత్య దేశములలో చాల వ్యాపించి యుండెను.

పాశ్చాత్య దేశస్థులు "విజయనగర సామ్రాజ్యము", "మరచి పోయిన విజయనగర సామ్రాజ్యము" గురించి, "ఎప్పుడు మరపు రాని విజయనగర సామ్రాజ్యము" అను పుస్తకములను వ్రాసిరి.

విద్యారణ్యస్వామి గురువు విద్యా శంకర తీర్థస్వామి అను ఆయన ఖేచరీముద్ర ద్వారమున లంబికా యోగమును నవలంబించి 1333వ సంవత్సరము కార్తీక శుక్ల సప్తమినాడు తనమీద ఒక సమాధి కట్టించుకొని, అందులో జీవ సమాధి తీసికొనెను.

ఆ సమాధి ఇప్పటికిని కొత్తగా నిర్మించినట్లు కన్పించును. దానియొక్క ముఖమంటపమున 12 స్తంభములను నిర్మించెను. వాటిపైని సూర్యుడు 12 రాసులలోను తిరుగునప్పుడు ఒక్కొక్క స్తంభము మీద సూర్యకాంతి పడును. ఆ సమాధి యిప్పటికిని కొత్తగా నిర్మించినట్టు కనబడుచుండును. ఈ విశిష్ట నిర్మాణము ఎట్లు చేయబడెనో చూచుటకును, శోధన చేయుటకును విదేశీయులు వచ్చుచుందురు. కాని ఎట్లు నిర్మింపబడినదో దాని అంతు పట్టుకొన లేకపోయిరి. ఖగోళ శాస్త్రజ్ఞులు గూడ దీనిని వచ్చి చూచిపోవు చుందురు. కాని దాని అంతు ఎవరికిని చిక్కలేదు.

ఆదిశంకరులు కాశ్మీరు దిగ్విజయము నుండి వచ్చినపుడు తీసికొని వచ్చిన శ్రీదేవి యొక్క చందనపు విగ్రహమును, శ్రీ విద్యారణ్య స్వామివారు పంచధాతువులతో చేసిన ఇంకొక విగ్రహమును స్థాపించిరి. విద్యారణ్యులు స్థాపించిన విగ్రహము ఇప్పటికిని అక్కడ ఉన్నది.

హంపిలో ఉన్న విరూపాక్ష దేవాలయము ప్రక్కన ఉన్న 2 అడుగుల ఎత్తుగల విద్యారణ్యస్వామి కుడి చేతితో ఉపదేశము చేస్తున్న విగ్రహమొకటి గూడ ఇక్కడ కలదు.

# శ్రీ స్వామి సద్గురు జ్ఞానానంద గ్రంథావళి

1. శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతము (ద్వితీయ ముద్రణం)

ఆధునిక భారతదేశ యోగిపుంగవులలో విశిష్ట వ్యక్తిత్వ శోభితులు శ్రీ స్వామిజ్ఞానానంద పరివ్రాజకులుగా పరమోన్నత శిఖరాల నధిష్టించి, విఖ్యాత విజ్ఞానవేత్తగా అంతర్జాతీయ ప్రశస్తి గాంచి జ్ఞాన విజ్ఞాన సమన్వయం చేసిన పరిపూర్ణ తత్త్వ దర్శనులు. ఈ గ్రంథములో స్వామివారి తీవ్ర తపశ్చర్యలు, జర్మనీలో వారి దార్శనిక ప్రవచనాలు, ఇంగ్లండులో అమెరికాలో శ్రీవారి పరమాణు విజ్ఞాన పరిశోధనలు అత్యంతోత్తేజకాలు.

(పుటలు 330) మూల్యం. రు. 25/-

2. "పూర్ణ సూత్రాలు." (ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతం)

శ్రీ స్వామి జ్ఞానానంద సద్గురు పాదులు తమ తత్త్వ దర్శనానుభూతులను 560 సూత్రాలుగా సూత్రీకరించిన సంపుటి.

మూల్యం రు. 15/-

3. యోగ దర్శనం ('ది ఫిలాసఫీ ఆఫ్ యోగ')

సద్గురు పాదులు శ్రీ జ్ఞానానంద ఇంగ్లీషులో రచించిన గ్రంథం. ఆగ్రా విశ్వవిద్యాలయంలో ఇచ్చిన విశిష్టాదార్శోపన్యాసం.

మూల్యం రు. 10/-

4. 'గ్లింప్సెస్' (కవితాంజలి - స్వామి జ్ఞానానంద రచించిన ఆంగ్ల కవితా సంపుటి.

మూల్యం రు. 10/-

లభ్యస్థానం :

శ్రీరామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్

గొరగనమూడి - 534 244

భీమవరం తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా, ఆంధ్రప్రదేశ్

శ్రీ రామ జ్ఞానమందిర పబ్లికేషన్ లీగ్
జ్ఞాన విజ్ఞాన విహార్ (గొరగనమూడి)

వారి

## తెలుగు ప్రచురణములు

1. శ్రీమత్ స్వామి జ్ఞానానంద చరితామృతము.
2. జ్ఞానానంద లేఖావళి
3. శ్రీమత్ స్వామి జ్ఞానానంద సద్గురు పూజా కల్పము
4. శ్రీమద్భగవద్గీత (స్వామి ప్రణవానంద, కైలాస మానస సరోవర తీరవాసి)
5. గాయత్రీ మంత్రార్థ వివరణము
   స్వామి ప్రణవానంద
6. శ్రీ జ్ఞానానంద సద్గురు వైభవము
   స్వామి ఆత్మానంద
7. శ్రీ జ్ఞానానంద గేయామృతము
   వేగిరాజు వెంకట రామరాజు
8. శరణాగతి - కళాప్రపూర్ణ
   పెనెత్స సత్యనారాయణరాజు, తణుకు.
9. మూడు మూర్తుల దేవర
   చేకూరి చెన్న కృష్ణయ